




# భజనకీర్తనలు

ఇవి

శ్రీనివాసుల శివకామసుందరిచే

వ్రాయఁబడి

ప్రయాగ ప్రకాశరావుగారిచే

లేఖకప్రమాదాదిదోషంబులు లేకుండ

సరిచూడఁబడి

స్వప్రకాశముద్రాక్షరశాలయందు

ముద్రింపించి

ప్రచురింపఁబడెను.

---

1913.

 [ వెల 0 2-0.

# పీఠిక

## సోదరసోదరీమణులకువిజ్ఞప్తి.

నేనునిరంతరము పురాణపుణ్యకథాశ్రవణమందు మిగులఁగుతూహల మొందుచుండెడిదానను. ఎక్కడనుబురాణశ్రవణభాగ్యములభింపని సమయములలో నాశక్తికొలఁది శ్రీరామనామములఁ బఠించుకొనుచు నొక్కప్పుడా పావననామముల వ్రాసుకొనుచుఁ గాలక్షేపమొనర్చుకొనుచుండుదును. ఇట్లుండ నొకప్పుడు భగవంతునిగూర్చి కొన్నికీర్తనలు పాటలు వ్రాయవలయునని నొక యూహఁదోఁచి నాకించిజ్ఞతనైన నగణింపక నాసంకల్పమునకుండోడు శ్రీరాముఁడొకఁడని యూఢభక్తిచే వెంటనే పాటలవ్రాయఁ బ్రారంభించిభగవత్కటాక్షమునఁ గొలఁదిదినములలోన యీచిన్నపొత్తము ముగింపఁ గలిగితి. పరమేశ్వరుఁడు నా[illegible] జేయిం చెఁగదాయనుసంతోషమునుచే [illegible] వలయునను నాకుతూహలమునకుఁ దో[illegible] నా[illegible] నాకష్టిన ప్రోత్సాహమున [illegible] యము[illegible]ములు న్నను [illegible] మున [illegible] ప్పుడును గొంతతగ్గునుగదా. గ్రంథరచనకిది ప్రథమ ప్రయత్నమగుటచేఁ గలిగినదోషములు నాకొక మాత్రమునుదెలిపి దిద్దుకొనఁ జదువరు లనుగ్రహింతురుగాత.

గుంటూరు
అరండల్ పేట

గృహ విధేయురాలు
శ్రీనివాసుల శివకామసుందరి.





శ్రీరస్తు.

# భజనకీర్తనలు.



క॥ కవులకుగణనాధునకున్
భవునకు పార్వతికిసిరికి వైకుంఠునకున్
గివిజానీక జ్యేష్ఠున
కవిరళముగ శారదాంబ కంజలిజేతున్॥

## 1 శంకరాభరణము - ఏకతాళము

శ్రీరమేశ నిన్ను - చేరివేడెద
పరా పారవార - ధీరామారాకార,శూర॥ శ్రీ॥

1 సన్నుతించెదనా - పన్నరక్షక
నిన్నువినావేరే - యన్యులనువేడ లేర॥ శ్రీ॥

2 జయకరా, సర్వేశ - దయనుగావరా
భయవిదూర నిజ - భక్తపరిపాల శీల॥ శ్రీ॥

3 ధరణిభద్రగిరి - ధామరాఘవా
సరసిజాసనాది - సన్నుతా, ప్రదాత, నేత॥ శ్రీ॥

2 ఫరజు రాగం-ఏక॥ ["ఇన్నాళ్ల వలెగాదే" వలె]

విన్నపమాలింపుమా - పన్నగశయన ప్రసన్న వరదనా॥ వి॥

1 జాతినాతినిఁ జేసి - ఖ్యాతివహించిన
పీతాంబరధర - ప్రీతితో వేడితి॥ విన్న॥

2 మేల్మిమిగాని - బాలిక వలె నన్ను
బాలన సేయుమ - శ్రీలలనేశనా॥ వి॥

3 అండజవాహావే - దండరక్షకసీ
యండఁ జేరితిని - ఆదరింపుముదయ॥ వి॥



## 3 సురట-రూపకం.

["భజనపరులకేల" వలె]

దండపాశిభయములేని - దారిజూపుమీ
నిండువేడ్క నిన్నుఁ గొలుచుచుండు భక్తులంగఁ జేర్చి॥ దం॥

1 అండచరాచరములకునుఁ నాదిమూలమైనఘనుడ వా
పుండరీకమునను నిల్పి - పూజఁ జేసెద
నిండుకరుణతోడ నన్ను - నీరజాక్ష ప్రోవుమంటి
నండ జేరి వేడుకొంటి - నాదరింపసమయమంటి॥ దం॥



## 4 నాగవరాళి-ఆది.

("నగుమోముగనలేని" వలె)

కరుణించినను బ్రోవఁ - దరుణమిదేరా
సురలోకవంద్య - వేగమె॥ కరు॥

1 కరిచర్మాంబరమిత్ర - కమనీయగాత్ర
నెఱనమ్మితినీ-చరణాంబుజములఁ-బరమప్రీతిని॥ క॥
2 వరమిచ్చు - చోరవీవని - మురియుచునున్నారా
పరిపాలించుటనీకు - మఱపాయోభూపా ॥
ధరలోనీ, సరిదైవముగలదా - ఇదిబిరుదా
శరణాగతవ, త్సలుఁడవునీవికఁ గాదా
దయరాదా, రఘువర॥ కరు॥



5 తోడి-ఆది.

("కడ తేరరాదామనసా" వలె)

కరుణింపరా, రా, రాఘవా
1 మొఱవినివేగ - దరిఁజేర్చరాదా
ధరనుత మనో - హరరాకుమార॥ క॥
2 శరదిందుశే - ఖరమిత్రనీ చరణంబులే - శరణమనుచు
నెఱనమ్మినారా- నీరదశరీర వరభద్రశైల
వాసరామచంద్ర॥ క॥



6 యమునాకళ్యాణి-రూపకము.

("గాన మొసఁగరాదా" వలె)

ఏలనాతోవాదు- నీలమేఘశ్యామ, రామ॥ ఏ॥
కాలహరణమేలనన్ను - పాలించుమొఱాలించు॥ ఏ॥
1 సురలునిశాచరులుగూడి- సురుచిరముగ జలధిఁదఱవ

గిరిభారమోర్వలేక - ధరాధరమునీటఁగ్రుంగ
గిరిమోచి - ధరగాచిన - గీర్వాణవంద్యనిను
పరిపరివిధముల వేడినఁ - బలుకవేమిపరమపురుష॥ ఏ॥



7 గౌరీమనోహరి॥ త్రిశ్ర॥ రూపకం॥

నగుమోముజూపవే - సుగుణభూషణనీదు॥ నగు॥
వగదాన నానేను - ఖగరాజవాహానా ॥నగు॥

1 మందమతినని నన్ను - మఱవకుము దేవ ము
కుంద నీచరణార - విందములె గతియంటి
మందరోద్ధారకా - మొందుదాగితివయ్య
కందర్ప శతకోటి - కాంతిలావణ్యానీ ॥న॥

2 నిగమంబులను నాల్గు - మొగములను బఠియింప
జగదీశ నిన్గనన - శక్తుఁడాయెను నలువ
అగణితాధారుఁడవు - ఆనందమయుఁడనీ
మగువతోడుత వచ్చి - మన్నించి యిఁకనైన ॥న॥



8 దర్బారు-ఆది.
("నారదనాధ" వలె).

ఎంతని వేఁడుదురాఁ ఇఁకనైననాఁచింతఁదీర్చవేరా
1 అంతరంగమున - నతిభక్తినినిను. [తడవేలా॥ ఎం॥
చింతఁజేసినఁ - బంతముఁబూనెదో॥ ఎం॥
2 జలచరమ్ముచేఁజిక్కి-వడినసామజముగావలేదా

అలసుగ్రీవుని చెలిమిఁజేసి - యవనిజఁగనలేదా
ఖలుఁడగు రావణుతమ్ముఁడు - శరణనభయము
[మ్మానప్పలేదా
ఇలలోనీసరి మెవ్వరు లేరని - పలుమరు వేఁడినఁ
బలుకవు నాతో॥ ఎం॥



## 9 కీరవాణి-రూపకము.

("వరములొసగి" వలె)

సిరులొసఁగెడి శ్రీరాముని - సేవింతము రారమ్మ

1 పరమాత్ముని - చరణములకు-భక్తితో నమస్కరించి॥సి॥

2 నీరజదళనేత్రునినవ - మారకోటి తేజుని॥ సి॥

వారిధిగంభీరుని న - పారకరుణాపూర్ణుని
కోరికొలుచువారికెల్లఁ - గోర్కులొసఁగుధీరుని
గారవములుమీరమదిఁగోరుఁడి- కోదండధరుని ॥సి॥



## 10 ఖరహరప్రియ- ఆది

("నాటిమాటమరచితివో" వలె).

ఏటికి - వాదిూఁచ- దయరాదు- శ్రీరాఘువేంద్ర॥ ఏ॥

1 సాటివారిలోనన్ను - చౌకసేయకుమని
మాటిమాటికినీతో - మనవిఁజేసుకొంటి॥ ఏ॥

2 దాసరక్షకుఁడవని - యాసతోఁగొలచితి
మోసముచేయకు వాసవవందిత॥ ఏ॥
3 అపరాధిననినన్ను - ఆదరించుటమాని,
కృపజూడకున్నావు - తపనాత్మజార్చిత॥ ఏ॥
4 పరమభక్తితోనిన్ను - బరిపరివిధముల
మరిమరి వేఁడఁగ - మఱచితివోనన్ను॥ ఏ॥

11 ("బ్రోవవమ్మ" వలె)

రామనన్నుబ్రో - వఁగరాదా - లోకాభి ॥రా॥
తామసించ మేరా - దశరథబాలా ॥రా॥
1 దరిఁజేర్చుదైవమునీవని - నిరతముధ్యానించుచుంటిని
పరమాత్మనీపద - సరసిజములఁగొల్చు
వరమిచ్చిరక్షింపవే - మఱవకవేగ ॥ రా॥
2 నీలవర్ణనిదాసులలోఁజేర్చి - తాలిమితోఁగృపఁజూడవె
ఏలయోచనయిఁక - జాలముసేయకు
ఫాలలోచనమిత్ర - పరమపవిత్ర॥ రా॥

12. కేదార-రూపకము. ["సమయమిదే" వలె]

ఎంతనినే విన్నవింతురా - శ్రీరామచంద్ర॥ ఎం॥
1 అంతరాత్మనీమహిమను - సుంతైననెఱుఁగనైతి
చెంతఁజేర్తువనుచునుంటి
పంతమనామీఁదభక్త - చింతామణిదంతివరద॥ ఎం॥

2 రావుసేయమేరకాదు - రేపుమాపుజరుపరాదు
ప్రాపునీవె, వేరేలేదు
కోపముసేయకనాపరి - తాపముఁబాపుము శ్రీపతి॥ ఎం॥
3 వేలకొలఁదిసుజనులకు - మేలివరములొసఁగలేదా
జాలమేలచేసెదవుఁ
తాలిమితో ఁగృపచూడవ - దేలా కరుణాలవాల॥ ఎం॥



13 నాథనామక్రియ - త్రిపుట.

వినరాదానామనవి - ఇనవంశోద్భవ, రామా॥ వి॥
నెనరుంచి, నామీఁదఁ - ననుమానములుమాని॥
1 చిన్నబాలుఁడుధృవుఁడు - శీతాతపములనకఁ
సన్నుతించఁగసుప్ర - సన్నతనీలేదా॥ వి॥
2 మేలుదైవమనుచు - చాలఁగఁగొలిచితి
నీలవర్ణుఁడనన్ను - పాలింపుమిఁకనైన॥ వి॥
3 వాసిగభద్రాద్రి - వాసమైవెలసిన
శ్రీసదాశివమిత్ర - సీతాతోఁజనుదెంచి॥ వి॥



14 కమాచ్-ఆది. ["సారససమముఖపరమ" వలె]

రామునిభజియింపవేమనసా॥ఘననీలమేఘశ్యాముని॥భ॥
1 సామగానలోలుని శుభశీలును

[ప్రేమమీరవందనములొనర్చుచు॥ రాము॥

2 కోటిసూర్యులనుమించినరత్నకి- రీటముగలవాని
త్కేటముత్యపుసరులను నురమున - శోభగలవాని
హాటకమణిమయ - సింహాసనమున
సాటిలేనికొలువమరినసీతా॥ రాము॥

3 సురకిన్నరకింపురుషులుమేలని
విరులటుచల్లఁగను - వరనారదముని వీణాగానము
మురియుచుఁజేయఁగను - పురజనులందఱు-హర్షము
పరిపరివిధముల - బహుపరాకనగ॥ రా॥ [మీరఁగ



## 15 కమాచ్-ఆది.

ఏలా, దయరాదు- రఘురామాచలమేలరా ననుగావ

1 ఘోరభవాభవ - వార్ధిమున్గి [రాయిఁక॥ నే॥
దారితెలియనైతిరామా - మంచిదారితెలియనైతి॥ రా॥
ధిరా, నరా, పరా, త్పరా॥ నన్నే॥

2 ఆసవలలోఁజిక్కితి - మోసగాండ్రకుఁదక్కితి
ఈశాయిద్రెమ్రొక్కితి - జగ - దీశానీకెమ్రొక్కితి.
అసమానకృపచేనా - దెసఁజూడుమిా॥ నన్నే॥



## 16 తోడి-రూపకము.

వెఱవకుమని వేగరావుగా శ్రీరామచంద్ర॥ వె॥
మఱుఁగుఁజొచ్చి వేఁడుకొన్న - కరఁగదేమినీమనసు॥ వె॥

1 పరననుచును - దలఁచినావా । సురవందితచరణా॥
కరినేలినావనివిని - శరణాగతనై కొలిచితి
కరుణింపరావదేమి - పరమదయాళుతమీరఁగ
వరభద్రాచలవాసా - నిరతమునినునెఱనమ్మితి॥ వె॥



## 17 బిళహరి-ఆది

మోఁవినవేమి - మురహరశౌరి నా॥ మొ॥
పరులనే వేఁడను - ఫణిరాజశయననా॥ మొ॥

1 నిన్ను వేఁడుచుంటి - నన్నుబ్రోవుమంటి
గన్నతండ్రివంటి - గనులఁజూడమంటి నా॥ మొ॥

2 ఆపదుద్ధారక - పాపనివారక
మాపు రేపనియనక - మన్నించిదయచే॥ మొ॥



## 18 శుద్ధసావేరి - చాపు.

కృపచూడు రఘురామచంద్ర
అపచారినైననా - నెపములమన్నించి॥ కృ॥

1 పారిజాతహార - వారిధిగంభీర
ఘోరకలుషహార - మారసుందరాకారా॥ కృ॥

2 వనజాక్షునినువేఁడు - దినమెసుదినమని
మనమునఁదలఁచినే - ననయమువేఁడితి॥ కృ॥

3 స్థిరముగభద్రాద్రి - పురముననెలకొన్న
కరుణాసాగరసీతా - వరభక్తమందార॥ కృ॥



19 ఎదుకులకాంభోది-ఆట. ["ఏమాటలాడిన" వలె]

వేమారుపిలిచిన - మోమైనఁజూపవు
ఏమయ్యా శ్రీరాఘవా॥
కామజనకనిన్ను - కామితమిమ్మని
ఏమైనఁనడిగితినా - ఇనవంశభూషణ॥ వే॥

1 తల్లిదండ్రియునాదు - దైవమునీవని యుల్లమందుఁనమ్మితి
ఫుల్లాబ్జనయనా - పురుహూతనుతబ్రోవ
వల్లకాదన్ననే - వదలిపెట్టనుసుమ్మ

2 పామరమతినని - పాలింపకున్నావా
భవబంధమెడలింపవా ॥
ప్రేమమీరఁగనీదు - ప్రియభక్తులలోఁజేర్చి
తామసించకనన్ను - దయతోడరక్షించు॥

## 20 నాథనామక్రియ-ఆట.

శరణుశరణురామ - చంద్రవదయానిధి ।
కరుణింపసమయమయ్యా ॥

1 పరిపూర్ణవిఖ్యాత - పావనసుచరిత
సరసిజభవనుత - సురమునిపూజిత ॥శ॥

2 భీతచిత్తనుసదా - పీతధైర్యారాల
సీతాపతిరామా - గతినీవయ్యా ॥శ॥
వాతాత్మజవినుత - భూతదయాపర
నాతప్పుమన్నించు - ననునీదరిఁజేర్చు ॥శ॥

3 లంకేశుపురినియే - శాంకనయనఁగని
లెంకకరువలిపట్టి - జంకులేకనుదెల్ప ॥శ॥
పొంకముఁగో సేతు - వునుదాటియరిగీటి
పంకజాననఁగొన్న - పట్టభద్రరామా ॥శ॥



## 21 మోహన-ఆది.

చూడరె చెలులారా । మన
సూర్యకులాబ్ధిచంద్రుఁడౌరాముని ॥

1 వాడవాడఁగల - వనితలెల్ల । నీఁ
డేడులోకముల - నేలెడుస్వామిని ॥చూ॥

2 కనకాసనమందు - సీతా। కాంతతోఁగొలువుండ
సనకాదులుసం - భ్రమమునఁగొలువఁగ
గణికాచయములు - నను వృగనాడఁగ ॥చూ॥

3 రంగుగదశరథుఁడు - తనయుని। పొంగుచుఁగనుగొనఁగా
అంగనలెల్లఁజె - లంగుచుముదమున
మంగళములుపాడా ॥చూ॥

4 సోమునినోడించు - రాముని । మోమునుఁగనుగొనుడీఁ
ప్రేమమీరభూమిజనునెనఁగుటకు
ఏమితపముచేసెనో యీజనకుఁడు ॥చూ॥



22 ("హరిచరణాస్మరణామృతపావనం" వలె)

రారేరారే - రాములపూజకు
తేరేతేరే - దివ్యసుమంబులు ॥రా॥

1 సారసనేత్రుఁడు - నారదమిత్రుఁడు
కారుణ్యపాత్రుఁడు - కమలావరుఁడు
కోరినవారికిఁ - గోరికలొసఁగను
ధీరుఁడై వెలసెను - ధారుణిస్థలిని ॥రా॥

2 మల్లెలు మొల్లలు - మాలతిపూవులు
నల్లనికలువలు - నాగమల్లెలు
కొల్లలుగామన - మెల్లనుగూర్చి
ఫుల్లాబ్జాక్షునిఁ - బూజలు సేయఁగ ॥రా॥

23 ఖరహరప్రియ-ఆది.

("తరుణిరో సద్గురునిబాసి" వలె)

తరుణిరో శ్రీరాములఁగనుఁగొనఁదరమె యెవరికినీ ॥

1 విరిబోణులందఱుఁగోరి - వెఱువకమాటిమాటికి
మరునిఁగన్నగురుఁడితండని - శరణుచొత్తము ॥త॥

2 ఇందువదనలెల్లఁగూడి - సందడిగాఁబాటలుపాడుచు
సుందరరూపుని-ముందరనిలబడివందన మొనరుతము॥త॥

3 వాసిమీరభద్రాచలని - వాసుఁడైనదాసవరదుని
వాసుదేవరక్షించుమని - పలుమఱుఁగోరుదమె ॥త॥



24 ("కృష్ణకేశవా విష్ణుమాధవా" వలె)

1 రామరాఘవా - యో - రాక్షసాంతకా
కోమలాంగనాపైనింత - కోపమేలరా ॥రా॥

2 దీనరక్షకా - యో - దివ్యగుణమయా
భానువంశభూషరామ - భద్రబోనరా ॥రా॥

3 భద్రగిరివరా - యో - అద్రిజానుతా
క్షుద్రగుణగణాంతకా - సద్బుద్ధిసెల్వరా ॥రా॥



25 ఆరభి-రూపకము.

కొనియాడితి నీమహిమల - ఇనవంశోద్భవరామా
ఘననీలమేఘశ్యామ - వనజదళాక్షా ॥కొ॥

1 నినునమ్మినదానఁగాన - ననుమాన మేల బ్రోవ
మునుశబరికిమోక్షమొసఁగి - వినుతిఁగనినదొరవనినిన్ ॥కో॥

2 కులసతినిర్గొనిచనిన - ఖలునితమ్ముఁడనితలఁపక
నిలనేలుమనుచుఁదెల్పిన - బలుదాతవుకావా
సలలితమతినై నినునా - కులదైవమనితలఁచితి
పలుమాటలేలనన్ను - పాలించుముభక్తవరద ॥కో॥

3 శరణాగతవత్సలనిను - మురిపెముతోఁబూజించితి
కరుణించిరావదేమి - పరివారముకొలువా
మొఱలిడుకాకాసురుఁగని - కరమునఁగాచినసీ
బిరుదెందుదాచితివో - వరభద్రాచలనిలయ ॥కో॥



26 శహాన-ఆట.

("సుదతిరో సద్గురు" వలె)

రారెపోఁదము భద్రా - చలనిలయుదరిసింపను

1 వారాశితనయూహృ - చ్చోరునిరణరంగ
ధీరునివరసుకు - మారునిఁబాడఁగన ॥రా॥
తండ్రివాక్యముకొఱకుఁ - దరుణితమ్మునిఁగూడి
దండకాటవికేగి -
మెండురక్కసులను - జెండుబెండాడిన
చండప్రతాపుని - జగదీశుఁబూజింప

గుందుమల్లెలుసన్నజాజులు - ఖండశర్కరకదళీఫలములు
నిందువేడుకతోడఁగొనికో - దండపాణిసముఖమునకు ॥



27 శహాన-ఆది.

కనుగొంటిని నేను - కారుణ్యనిధినీ
ఘనులుపూజించెడు - ఘననిభశ్యాముని ॥కను॥

1 అలనల్లకలువరే - కులచాయమేనిపై
చెలువమరినపసిఁడి - చేలఁగట్టినవాని
వెలలేనిభూషణా - వళులనుధరియించి
నళినాక్షితోఁగూడి - కొలువమరినవాని ॥కను॥

2 భక్తబృందములకు - బలువైభవముతో
భుక్తిముక్తులనిచ్చు - భూమిజాధిపుని
సత్యస్వరూపుని - సాకేతనిలయుని
నిత్యమంగళకరుని - నిగమాంతవేద్యుని ॥కను॥



28 ధన్యాసి-ఆట.

నెఱనమ్మిభజియించితి - శ్రీరాముల ॥

1 అరమరలేకను - అమరులుమునులెల్ల
శరణుఁజొచ్చెడియా - చరణారవిందముల ॥నెర॥

2 దశరథవరపుత్రునీ - తాటకహరునీ

అసమానశుభగాత్రుని
పశుపతిమిత్రుని - పరమపవిత్రుని
శశిరవినేత్రుని - సత్యచారిత్రుని ॥నెఱ॥



29 కాంభోది-ఆట.

ఓదాశరథీ - నీదాఁపుఁజేరితి - నాదరింపుము రామా ।
వాదేలనాతోను - ఆది కేశవశౌరి
పేదననుచునన్ను - భేదము సేయకు ॥ఓ॥

1 ఉదరపోషణకునై - తుదలేనిసంసారో
దధిలోమునిఁగి నేను - వ్యథఁజెందితినిగాని
మదనజనకనిన్ను - మదిలోనఁదలఁచుచు
వదలనిప్రేమతో - వర్ణింపుచుంటిని ॥ఓ॥

2 ఎన్ని విధములనే - సన్నుతించినఁగాని
మన్ననతోనాదు - మనవిఁగైకొనవే
తిన్ననిసగవులఁ - దిలకించునీమోము
గన్నులఁజూపినా - కాంతులీడేర్పుము ॥ఓ॥



## 30 బేహాగ్-ఏక.

["గారారఘునందన" వలె]

రక్షించులక్ష్మీపతి - పక్షివాహనభూపతివేగ ॥ర॥

1 అక్షయకరుణాక - టాక్షుఁడవని పెద్ద
దీక్షవహించిన న్ను - పేక్షించమేరగాదు ॥ర॥

2 ఇక్కువలయమున - పెక్కుజన్మంబుల
సృక్కివేసారియే - దిక్కుఁగాననినన్ను ॥ర॥

3 వాసిగభద్రగిరి - వాసానేజేసిన
దోసముబాపికృపఁ - జేసివేవేగనన్ను ॥ర॥



## 31 నాటకురంజి-ఆట.

హరిహరిహరియని - మరువకఁదలఁచిన
నరజన్మమిాఁకేలునే - మనసా ॥హ॥
కరిగిరినిలయుని - పరిపరివిధముల
స్మరియించితరియించవే - మనసా ॥హ॥

1 ధనధాన్యములనెల్ల - దైవమనుచునెంచి
తనువునుబోషింపకే - మనసా

సనకాదిమౌనులు - సన్నుతించినయట్టి
వనమాలినినమ్మవే - మనసా ॥హ॥

2 మోసపుచ్చెడుపే - రాసవలలోఁజిక్కి
గాసిఁజెందెదవేల - నేమనసా
వాసిగభద్రగి - రీశునిపదముల
భాసురముగఁగొల్వవే - మనసా ॥హ॥



32 బేగడ-ఆట.

("ధర్మసంవర్ధని మాయమ్మా" వలె)

రామనీదయ - రానిదేమయ్యా । దాసులనేల
తామసంబిఁకసేయఁ - దగదయ్యా

1 నీమహాత్వము నెఱుఁగలేనయ్యా
స్వామినీశుభనామమే - గతివేరెలేదయ్యా । దిక్కెవ
రయ్యా ॥రా॥

2 కన్నతండ్రివినీ వెయనుకొంటి - సరివారిలోను
చిన్నతనముంజేయవలదంటి
మన్నవతో నామనవి - వినుమంటి । నామదినివేరే
అన్యదైవము వేఁడలేనంటి - శరణనియంటి ॥రా॥

3 దేవసేను - దీనురాలంటి । పావనుఁడనీపద
సేవయేకడ తేరుదోవంటి
భావమెఱఁగి బ్రోవవలెనంటి - భువిభద్రగిరిని
వాసనీవేత్రోడుసిడనంటి - నమ్మియుంటి ॥రా॥



33 సావేరి-ఆట.

కనుఁగొంటి శ్రీరాముల - నన్నులారా ॥

1 కనకాసనంబునఁ - గాంతతోఁగొలువుండ
మును జేసినపుణ్య - మునఘనశ్యాముని ॥కను॥

2 భరతుఁడు లక్ష్మణుఁడు - బరఁగ శత్రుఘ్నుఁడు
కరములఛత్రచా - మరములుఁబట్టగఁ
కరువలితనయుండు - చరణాంబులనునొత్త
గురుబంధుమిత్రులు - కొమరొప్పదీవింప ॥కను॥

3 ఇంద్రాదులుగగన - మందుననునిలిచి ।
మందారకుసుమముల్ - మణిమణికురిపింప ।
గంధర్వకాంతలు - ఘనముగ నాడఁగఁ ॥
గందర్పజనకుని - మందస్మితాననుని॥ కను ॥



34 యదుకులకాంభోజి-జంపె.

హెచ్చరికశ్రీరామ - హేపరంధామ
హేచ్చరికరఘురామ - హెసార్వభౌమ
పచ్చవిల్తునిగన్న - పరమాత్మరామ
అచ్యుతాశ్రీరమణ - అయోధ్యరామ ॥హె॥

అచ్చముత్తెపుసరులు - అసియాడగాను
ముచ్చటగసురచయం - బులువీవగాను
హెచ్చువాద్యములు - నింగినిఁజెలంగఁగను
మెచ్చిసుముని వీణె - మీటిపాడఁగను ॥హె॥

బింకమునలక్ష్మణుఁడు - బిరుదునుడువఁగను
అంకమునశ్రీలక్ష్మి - అమరియుండఁగను
పొంకమునభరతశ - త్రుఘ్నులరయఁగనిరు
వంకలనునిలచిచా - మరలువేయఁగను ॥హె॥



35 లాలి,

1 లాలిశ్రీరఘురామ - లాలిగుణధామ
లాలిమేఘశ్యామ - లాలిరిపుభీమ ॥లాలి॥

2 నిత్యమంగళరూప - నిగమాంతవేద్య
సత్యస్వరూపమో - సర్వజనవంద్య
ముక్తిదాయకజగ - న్మోహనాకారా
భక్తపరాధీన - పరమాత్మరామ ॥లాలి॥

3 కాలమేఖముబోలు - కాంతినెమ్మేన
లీలమీరంగపసిండి - చేలధరియించి
కాలరాక్షసబాధ - కడతేర్చిభద్ర
శైలముననిలచిన - జానకిరామ ॥లాలి॥



36 మంగళహారతి.

("నామొరాలించవదేమి" వలె)

మంగళహారతిగైకొనుమాశు - భాంగరాఘవా ॥

1 ఫాలాక్షువిల్ద్రుంచి - భామినింగూడితివి
లీలమీరంగా ॥లీ॥లీ॥లీ॥లీ॥

2 దానవిచెండాడి - తపసియాగముగాచిన
మానవాగ్రణీ ॥మా॥మా॥మా॥మా॥

3 ఖరుడురావణత్రిశిర - గర్వంబులణంచ
నరుడవైతివి ॥న॥న॥న॥న॥

4 భక్తులందఱబ్రోవ - భద్రాచలని
వాసివైతివి ॥వా॥వా॥వా॥వా॥

యాలలు.

రామ రామయనుచునీదు - నామస్మరణ జేయునాదు
భేములనుభారదోలవా - శ్రీరామచంద్రా
కామితార్థమిచ్చిగావవా ॥ రా॥

ఆపదుద్ధారకనీదు - ప్రాపుచేరి వేడుచుంటి
పాపములనుపరిహరించవా - శ్రీరామచంద్రా
దాపు జేర్చిదయనుగావవా ॥ రా॥

వాసిమీరభద్రశైల - వాసదాసపోషకనా
దోసములనుదోస్రబోవవా - శ్రీరామచంద్రా
శాశ్వతపదమునివ్వవా ॥ రా॥

సంపూర్ణము.



